Approved by the Text-Book Committee, Madras, for class-use Vide Fort St. George Gazette, dated 19-3-54 Page 98 & Text Book Committee, Andhra Dated 12-4-56 Page No. 40.

---

# రత్నమంజూష


రచయిత:

ఉభయభాషాప్రవీణ

వి. వి. నరసింహాచార్యులు,

ఆంధ్రభాషాప్రధానాధ్యాపకుఁడు.

యమ్. ఎల్. సి. ఎమ్. హైస్కూలు, గుంటూరు.






ప్రకాశకులు:

బాలసరస్వతీ బుక్ డిపో,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

కర్నూలు - మద్రాసు 1


కాపీరైటు రిజర్వుడు] 1958 [వెల 1-0-0

# తొలిపలుకు

పూర్వకావ్యములలోని కథలు కేవల పండితైకగ్రాహ్యములై యుండుటచే సామాన్యులు వానిం జదివి సంతసించుటకు వీలుకాక పోవు చున్నది. అట్లు నిగూఢముగా నున్న యా కథలలోని యింపుసొంపులు, తీయందనము తొణికిసలాడునట్లు వచన కావ్యరూపముగ రచించి సామాన్యులకును సుజ్ఞేయమగునట్లు చేయుట ముఖ్యావసరము. ఇట్టి యూహయే నన్నీగ్రంథమును రచించునట్లు చేయుటలో నెక్కుడు ప్రోత్సహించియున్నది.

ఇఁక నాధునికుల చరిత్రలైనచో వాని నొకతూరి వ్రాసిన యథార్థవిషయములతోఁ గూడి పఠనయోగ్యములై నిజమును దోపించునే కాని పలువురు పలురూపములతో నిర్మించిరేని వానియందలి యథార్థ స్వరూపమే మఱుఁగుపడును. అవియే పూర్వకథలైనచో నెంద ఱెన్ని రూపములఁ జిత్రించినను గొంగ్రొత్తరుచుల నీనుచుఁ జదువరుల కానంద దాయకము లగుచుండును.

కనుకనే నేనిపు డాధునికపురుషుల కథలు వ్రాయుట మాని మనోహరములైన కావ్యకథల రెంటినేర్చి "రత్నమంజూష" యను పేరుతో నీగ్రంథమును సంతరించియుంటిని. దురవగాహములగు నీకథలు చిక్కులీసి తేటతెల్లముగా నుండునట్లు రచింపఁబడియుండుటచే నీ గ్రంథమును బాలురు స్వయముగాఁ జదివి యానందింప వీలై యున్నది.

కావున విద్యాశాఖాధికారులును, సోదరపండితులును నీ గ్రంథము నాదరించి నాకును, ప్రకాశకులకును బ్రోత్సాహము కలిగింప సవినయముగ విన్నవించుచున్నాఁడ.

ఇట్లు
గ్రంథకర్త

# విషయసూచిక

# రత్నమంజూష

## 1. విష్ణుచిత్తుఁడు

విష్ణుచిత్తుఁడను వైష్ణవోత్తముఁడు పరమభక్తాగ్రేసరుఁడు. సద్గుణరాశి. అతిథిపూజా పరతంత్రుఁడు. భాగవత సేవానిరతుఁడు. అన్ని వేళలయందును విష్ణుసేవయే ప్రధానముగ భావించి భగవత్కైంకర్యము చేయుచుండు పరమజ్ఞాని. ఇట్టి మహనీయుని గన్న తల్లిదండ్రులకంటె లోకములో ధన్యతము లుండఁజాలరు గదా. ఈ మహనీయుని జన్మచే నా బ్రాహ్మణవంశము పునీతమైనది. వంశ మొక్కటియే కాదు, ద్రావిడదేశమే ధన్యమైనదని చెప్పవలనుపడును. ఇట్టి మహానుభావులఁ బలువురను గనుట వలననే భారతావని దేశము లన్నిటిలోను సమున్నతి కెక్కినది.

ఈ వైష్ణవోత్తముఁడు పాండ్యదేశములోని శ్రీవిల్లిపుత్తూరను నొక గ్రామమున నొక శ్రోత్రియ వైష్ణవ కుటుంబమున జన్మించెను. ఆతఁడు బాల్యమునుండియు భగవద్భక్తి గలవాఁడై యా గ్రామములోనున్న విష్ణుమూర్తికి సేవాకైంకర్యముఁ జేయుచుఁ గాలము గడపుచుండెను. ఈతనికి యుక్తవయసు వచ్చిన పిదపఁ దలిదండ్రు లనుకూల

వతియైన కన్యకను దెచ్చి వివాహము చేసిరి. అటనుండి యా భక్తుఁడు సహధర్మచారిణితోఁగూడఁ గాఁపురము సేయుచు నతిథిపూజను యథారీతి నెఱవేర్చుచుండెను. ఆతఁడు తన గ్రామమునకు వచ్చిన భాగవతోత్తముల కెదురేగి వారికి నమస్కరించి సగౌరవముగా నింటికిఁ గొని వచ్చి పలువిధములుగఁ బూజించి వారిని మృష్టాన్నములతో సంతృప్తిపఱచుచుండును. భార్యయు నే సమయములోఁ దన యింటి కతిథులు వచ్చినను గష్టమనక అప్పటికప్పుడు వండి యాదరణతో సంతృప్తిగ భోజనము పెట్టుచుండెడిది. ఇట్టి యనుకూలవతియగు భార్య లభించుటచే విష్ణుచిత్తుఁ డెట్టి శ్రమయు లేక సంసారయాత్ర జరుపుచుండెను. మఱియు శనివారమునాఁడు వచ్చిన యతిథులకుఁ దలయంటుకుఁ దైలము సైతమిచ్చి యనేకవిధములగు పిండివంటలతో వారి నాదరించుచుండును. ప్రతి నిత్యము వాని యిల్లు వేదపాఠములతోడను, ప్రబంధపారాయణములతోడను, పుణ్యకథాప్రసంగములతోడను, కావ్యనాటకపఠనములతోడను మాఱుమ్రోఁగుచుండెడిది.

భక్తాగ్రగణ్యుఁడగు విష్ణుచిత్తుఁడు ప్రతినిత్యము శ్రీవిల్లిపుత్తూరునందుండు మన్నారుస్వామి పూజాకైంకర్యమునందు నిరతుఁడై స్వయముగాఁ దులసిమాలలు, పూలదండలు కట్టి పూజాసమయమునకుఁ దెచ్చి స్వామివారి కర్పించుచు, నా కైంకర్యము ముగియువఱకు ముఖమంటపమునఁ గూర్చుండి భక్తితో భగవంతుని నుతించి పిమ్మట స్వామివారి తీర్థ

ప్రసాదములను స్వీకరించి యింటికి వెడలుచుండెడివాఁడు. మన్నారుస్వామి యాతని నిశ్చలభక్తి యను ధనముచేఁ గొనఁబడి యెప్పటికప్పుడు భక్తుని కోర్కెల నీడేర్చుచుండును. ఈ రీతి విష్ణుచిత్తుఁడు భగవంతుని సాక్షాత్కారము పొంది లోకారాధ్యుఁడై యుండెను.

ఆ కాలమున దక్షిణదేశములో మత్స్యధ్వజుఁడను మహారాజు మధురానగరమును రాజధానిగాఁ జేసికొని పాండ్యమండలమును బరిపాలించుచుండెను. ఈ మహారాజు నీతిశాస్త్రవేత్త యగుటయకాక అసమాన పరాక్రమవంతుఁడనియు వాసిఁ గాంచెను. అట్టివాఁ డగుటవలననే సమస్త దేశాధీశులను జయించి వారివలనఁ గప్పములం గైకొని చక్రవర్తియై దేశమంతటిని ధర్మయుతముగాఁ బరిపాలించుచుండెను. ఇట్లుండ శిశిరకాలము గడచి వసంతకాల మారంభమయ్యెను. ఆ సమయమునఁ జెట్లన్నియుఁ జిగిర్చి నూతన శోభతోఁ బ్రకాశించుచుండెను. ఆ యేఁడు వర్షములు తక్కువగ నుండుటచే నెండలు మెండుగఁ గాయుచుండెను. అందువలన నుద్యానవనముల లోని మల్లెపొదలు బాగుగాఁ బూచి పరిమళములు వెదజల్లుచుండెను. ఆ సువాసనల ననుభవించుటకై యా పట్టణములోని స్త్రీ జనమంతయు నా యుద్యానవనములలో విహరించుటకు వెళ్లుచుందురు.

గ్రీష్మఋతువునందు మధురానగరమునకు సమీపమున నున్న వృషగిరియందు సదా వాసము కల్పించుకొనియున్న

సుందరబాహుస్వామికి బ్రహ్మోత్సవము జరుగుచుండెను. ఆంధ్రదేశమునుండి యొక పండితుఁడా యుత్సవములను జూడఁగోరి వచ్చి యా యుత్సవములు పూర్తియగువఱకు నచటనే యుండి భగవంతుని సేవించి యటనుండి సమీపముననే యున్న మధురానగర సౌందర్యమును జూడఁగోరి కొన్ని ప్రయాణములలో నా పట్టణమును సమీపించెను. అచట మార్గమున కిరుప్రక్కల బాటసారులు బరువులు దించుకొని విశ్రమించుటకై తాతిపలక లమర్చఁబడి యుండెను. వానిం గాంచి కొంతదికాల మట విశ్రమించి దారిబడలికఁ దీర్చుకొని వెళ్లఁదలంచి యొక తాతిపలకపై నంగవస్త్రము పఱచి మూటను తలగడగాఁ బెట్టుకొని పండుకొని యుబుసుపోకకై యేవియో శ్లోకములను జదువుచుండెను.

ఆ సమయముననే పాండ్యరాజు దేశవృత్తాంతములను స్వయముగాఁ దెలిసికొనఁ గుతూహలము కలవాఁడై మాఱువేషమును ధరించి యొక సేవకునితో బయలుదేఱి, యా మార్గముననే వెళ్లుచుండెను. ఆ బ్రాహ్మణుఁడున్న తాతిపలకను సమీపించునప్పటి కా పరదేశి బ్రాహ్మణుఁడు "వార్ధకములో సుఖములను బొందుటకై యౌవనముననే యత్నించవలెను. పరలోకమున సుఖములను బొందుటకై యిహలోకముననే ప్రయత్నము చేయవలెను." అను నర్థమిచ్చు శ్లోకమును జదువుచుండెను. ఆ శ్లోకమును వినిన రాజు సంతాపమునుబొంది, నే నింతవఱకుఁ బరలోక సుఖములకై యిహలోకమున నెంతమాత్రము ప్రయత్నించిన వాఁడను

కానుగదా! పరలోకానంద మెట్లు లభించఁగలదు? కాల మంతయు నిరర్థకముగాఁ గడపితిని. ఇంతటనైన నిట్టి వ్యర్థ చింతలు మాని పరలోక సుఖములకు వలయు యత్నములఁ జేసెద'' నని చింతించి యా ప్రయాణమును మాని తిరిగి యింటికి వెడలి యా రాత్రియంతయుఁ బలువిధముల నాలోచింపఁ దొడంగెను. ''ఏ దేవుఁడు పరలోక సుఖముల నిచ్చువాఁడో యావిషయమును ముందుగాఁ దెలిసికొనవలెను. ఈ నిర్ణయము చేయుటకుఁ బండితులే సమర్థులు. రేపటి సభలో నీ విషయమును బ్రవేశపెట్టితినేని పండితులు చర్చించి నిర్ణయింపఁ గల్గుదురు. నా సభలోనున్న పండితులతో సమానులే రాజ సభలలోను లేరని ప్రసిద్ధియే కదా! ఇఁక నీ విషయమై విచారమేల?'' అని తలఁచుచు నారాత్రి గడపి వేఁకువనే మేల్కాంచి కాలకృత్యముల నెఱవేర్చి, పండితబృందముతోడను, మంత్రి సామంతాదుల తోడను, పురప్రముఖులతోడను నిండియున్న కొలువు కూటమున కేగి స్తుతిపాఠకులు సాహోనివాదములు చేయు చుండ సింహాసన మలంకరించెను. అంత నా సభలోని పండితోత్తములఁగాంచి ''పండితపుంగవులారా! మీరు నే నడుగఁబోవు విషయమును శ్రద్ధగా నాలించి సరియగు సమాధానముఁ జెప్పి నా యభిమత మీడేర్పుఁడు'' అని వచించి లేచి నిలచి యొక చేత వరహాల సంచిని జూపుచు ''పూజ్యులారా! త్రిమూర్తులలోఁ బరలోక సుఖమీయఁ జాలిన దేవుఁ డెవఁడో నిర్ణయించి చెప్పి యా భగవంతుని

తత్త్వముపదేశించి నను ధన్యుంజేయుఁడు. అట్లు నిర్ణయము చేయువారీ వరహాల సంచిని గ్రహింపఁగలరు.'' అని చెప్పి యా వరహాల సంచిని సభలో వ్రేలాడఁగట్టించి తాను గూర్చుండెను.

రాజుగారి మాట వినినంతనే ధనమందలి వ్యామోహముచేఁ బండితులలో వాదోపవాదములు బయలుదేఱెను. కొందఱు లేచి శివుడే మోక్షప్రదాతయని సహేతుకముగా వచించిరి. మఱికొందఱు లేచి వారి వాదములను సయుక్తికముగా ఖండించి మోక్షమీయఁ జాలినవాఁడు శివుఁడు కాఁడనియు, సర్వలోకరక్షకుఁడగు శ్రీమహావిష్ణువే యనియు నిరూపించిరి. వేఱొక కొందఱు లేచి శివకేశవుల కట్టి శక్తి లేదనియు, సృష్టికర్తయగు నా భగవంతునకే యా మహాశక్తి కలదనియు వారి వాదములను ఖండించి తమ వాదమును నిర్ధారణ చేయుచుండిరి. ఈ రీతి వాదోపవాదములు ప్రబలెను. ఆ వాదములలో శైవపండితులు సమర్థులగుటచే వారి వాదమే సిద్ధాంతము కానుండెను.

శైవమునకే యిఁక మీఁదట ప్రాబల్యమువచ్చుటకు సిద్ధముగనుంత శ్రీవిల్లిపుత్తూరులోని మన్నారుస్వామి తన భక్తుల కోటమి కలుగుటకు సహింపజాలక వైష్ణవసిద్ధాంతమే లోకములోఁ బ్రబలునట్లు చేయసంకల్పించి యుపాయ మాలోచించుచుండెను. ఇంతలో విష్ణుచిత్తుఁడు స్వామివారి కైంకర్యముచేయ గుడికిరాఁగా స్వామి వానిం జూచి

'యితనిని బంపి యీ కార్యమును సాధింతు' నని తలఁచి వానితో నిట్లు చెప్ప నారంభించెను.

మన్నారుస్వామి :— ఓయీ! నీ విపుడే మధురాధినాథుఁడగు మత్స్యధ్వజభూపాలుని కొలువున కేగి వాదమున శైవుల నోడించి పరలోకసుఖముల నిచ్చు భగవంతుఁడు విష్ణువే యని నిర్ణయించుము.

వి. చి :— స్వామీ! మీకైంకర్యము చేయ నర్హుఁడ నగుదునే కాని రాజసభలలోఁ బండితులతో వాదింప నాకు సమర్థత యెక్కడిది?

మన్నారు :— నీ కీ విచారమేల? ఎవఁడైనను అహంభావమును వదలి నన్నే నమ్మి యే కార్యముచేసినను నది ఫలించి తీరును. సందియమందక శీఘ్రముగా వెడలి వాదములయందుఁ బాల్గొనుము.

వి. చి :— భక్తరక్షకా! ఆ సభలో నేను వాదింపఁగలనను ధైర్యము నా కిసుమంతయు లేదు. గెల్చుట యంతకంటె దుర్ఘటము. దేవా! యీ మాటలు వినిన నాకు భయ మతిశయించుచున్నది. నన్ను వదలి మఱియొకరి నాపనికి నియోగించి యీ దీనుని గాపాడుఁడు.

మన్నా :— విష్ణుచిత్తా! నీ వింత భయపడెదవేల? నే నంత మాత్రము తెలియక చెప్పితి ననుకొంటివా? సందేహింపక వెంటనే వెడలుము.

వి. చి :— అపజయము పొందిన అవమానము వచ్చునేమోయను భయము నా కిసుమంతేనియు లేదు. జయాప

జయములు నావి కావు. అన్నియుఁ దమవే. అట్లయినను దమ కపజయము కల్గిన నేనెంతయు సహింపఁజాలను. నేనోడిపోయి, తమ కవమాన మెట్లు కల్గించుదునా యనియే సందేహించుచున్నాఁడ.

మ. స్వా :—భాగవతోత్తమా! నీవట్టి సందియమందకుము. నీ వా రాజసభలోని పండితులను తప్పక జయింపఁగల్గుదువు. నీకు నిక్కువముగ జయము చేకూరును. సత్వరమే వెడలుము.

ఈరీతి మన్నారుస్వామి యాజ్ఞాపింప మాటాడఁజాలక విష్ణుచిత్తుఁడు ధైర్యమవలంబించి భగవంతునే మనసార ధ్యానించుచు మధురాపురమునకు వెడలి సభాద్వారమును సమీపించి ద్వారపాలకులచేఁ దన రాకను రాజున కెఱిఁగించెను. వారు వెడలి "మహారాజా! ఎవరో మహాపండితుఁ డొకఁడు మీ దర్శనమునకై ద్వారముకడ వేచియున్నాఁ" డని వచింప వెంటనే లోనం బ్రవేశపెట్టుఁ డని యాజ్ఞాపించెను. ద్వారపాలకులు వెడలి యా పండితోత్తముని లోనం బ్రవేశపెట్టిరి. ఆ భక్తాగ్రేసరుఁ డూర్ధ్వపుండ్రములను ధరించి బ్రహ్మతేజస్సు మోమునఁ దాండవించుచుండ లోనికి వచ్చుచుండెను. రాజా మహావ్యక్తిని దూరమునుండియే చూచి యాతఁడు మహానుభావుఁడై యుండ నోపునని యెంచి యెదురుగా వెడలి యా మహనీయుని సగౌరవముగాఁ గొనివచ్చి పీఠముపైఁ గూర్చుండఁజేసెను.

అపుడు విష్ణుచిత్తుఁడు మన్నారుస్వామిని మనసార ధ్యానించి లేచి సభవారి కభిముఖముగానిల్చి "పండితోత్తములారా! మోక్షమిచ్చు భగవంతుని విషయమైన మీమీ సిద్ధాంతి రాద్ధాంతముల నొకపరి వెల్లడించితిరేని వారివారి సిద్ధాంతములను ఖండింప వచ్చియున్నాఁడను" అని పలికి కూర్చుండెను. ఆ మాటలకు సభలోని వారెల్లరు నివ్వెఱపోయి చూచుచుండిరి. అంత నచటి శైవపండితులు లేచి పరమశివుఁడే పరలోక సుఖముల నీయఁజాలినవాఁడను సిద్ధాంతమును సహేతుకముగ నిరూపించిరి. విష్ణుచిత్తుఁడా శైవపండితుల సిద్ధాంతమును విని, వారి వాదమును సయుక్తికముగా ఖండించి విష్ణువే మోక్షదాయకుఁడని సిద్ధాంతము చేసెను. సభలోని శైవపండితులెల్లరు విష్ణుచిత్తుని వాదమునకు సమాధానము చెప్పఁజాలక నమస్కరించి యోడితిమని పల్కి మిన్నకుండిరి.

అంతట రాజా మహనీయునకు సాగిలిమ్రొక్కి పుష్పమాలలు వేసి విష్ణుతత్త్వ ముపదేశింప వేడుకొనెను. విష్ణుచిత్తుఁడు భగవంతుని మహిమ కచ్చెరువొంది, దిగ్దంతులైన పండితుల నోడింపఁగల్గుట భగవంతుని కరుణయే యని భావించి ఆ యాదిదేవునే మనసార ధ్యానించి రాజునకు విష్ణుతత్త్వ ముపదేశింపఁ దలఁచినవాఁడై "మహారాజా! నేను జెప్పఁబోవు నుపాఖ్యానమును సావధానముగా వింటివేని విష్ణుతత్త్వము సమగ్రముగా బోధపడఁగలదు. కనుక నద్దానిం జెప్పెద నాలింపుము.

పూర్వము నిమివంశమున మిత్రధ్వజ, కృతధ్వజులను నిరువురు సోదరులు కలరు. వారికి ఖాండిక్య కేశిధ్వజులను కుమారులు పుట్టిరి. వీరిరువురు వేఱువేఱు రాజ్యములను బరిపాలించుచుండిరి. కేశిధ్వజుఁడు ఖాండిక్యుని రాజ్యమపహరింపఁదలఁచినవాఁడై యాతని మీఁదికి దాడివెడలెను. ఇరువురును బదునైదు దినములు ఘోరముగాఁ బోరిరి. ఆ యుద్ధములో ఖాండిక్యుఁ డోడిపోయి రాజ్యమును విడచి మంత్రులతోను, భార్యాబిడ్డలతోను, భటసమూహముతోను నరణ్యమునకు వెడలి యటనే స్థిరనివాస మేర్పఱచుకొని యుండెను.

కేశిధ్వజుఁడు ఖాండిక్యుని రాజ్యమపహరించి పరిపాలనము చేయుచు సమస్తసుఖముల ననుభవించుచుండెను. కొంతకాలము పరిపాలించిన పిదప నిహలోకసుఖములయందు విరక్తి కలిగి పరలోకసుఖముల ననుభవింపఁ గుతూహలము కలవాఁడై గురువుల నడుగ వారు యజ్ఞముచేయ నాజ్ఞాపించిరి. కేశిధ్వజుఁడు సంతోషించి వారి యుపదేశానుసారము యజ్ఞము చేయ నిశ్చయించుకొనెను. అంతట నతి ప్రయత్నముమీఁదఁ గపిలధేనువును సంపాదించి దానిని సంరక్షించుచు యజ్ఞము ప్రారంభించు దినమునకై వేచియుండెను.

ఒకనాఁ డా కపిలధేనువు యజ్ఞశాలకు సమీపమున నుండు నరణ్యములో మేయుచుఁ గొంతదూరముపోఁగా నొక పొదరింటనున్న పెద్దపులి యా గోవును జూచి దాని మీఁదికి దుమికి మెడ కొఱికి దానిని పొదలోని కీడ్చుకొని

పోవుచుండెను. ఆ సమయముననే కొందఱు గొల్లపురాతు లా మార్గమున వెళ్ళుచు దానిని జూచి తఱుమఁగా నది యజ్ఞధేనువును వదలి పాఱిపోయెను.

కేశిధ్వజుఁ డవ్వార్తను గోపాలకునివలన విని యా ప్రదేశమునకు వెడలి చచ్చిపడియున్న గోవును జూచి యజ్ఞము విఘ్నముకానుండుటకు మిగుల వగచి ఋత్విజులను దర్శించి "గురువర్యులారా! యజ్ఞపశువు మరణించినది. అది లేకున్నను యజ్ఞము నిరాటంకముగా సాగుట కేదియైన ప్రాయశ్చిత్తముం దెల్పి నన్ను ధన్యుం జేయుఁ" డని వేఁడుకొనెను. "మహారాజా! దీనికిఁ దగిన ప్రాయశ్చిత్తము మేమెఱుఁగము. ఇట్టి ప్రాయశ్చిత్తముల నెఱిఁగినవాఁడు శునకుఁడను మహర్షి యొకఁడు మాత్రమే కలఁడని వినియుంటిమి. ఆ మహనీయు నడిగి తెలిసికొనుఁ" డని వచించిరి. అంతట కేశిధ్వజుఁడు శునకమహర్షి యాశ్రమమునకు వెళ్ళి వానికి నమస్కరించి జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పి ప్రాయశ్చిత్తము చెప్ప వేఁడుకొనెను. "రాజోత్తమా! ఇట్టి ప్రాయశ్చిత్తములలోఁ గొన్నిటిని మాత్రమే నేనెఱుఁగుదును. దీనికిఁ దగిన పాచిత మెద్దియో నాకును బోధపడుటలేదు. ఇట్టివానిని సంపూర్ణముగా నెఱిఁగినవాఁడు ఖాండిక్యుఁ డొకఁడే కలఁడు. ఆ మహనీయు నడిగితివేని నీ యభీష్టము నెఱవేఱఁగలదని చెప్పెను. అప్పుడు కేశిధ్వజుఁడు ధర్మాత్ముఁ డై యుండుటవలనఁ బూర్వపు విరోధమును గూడఁ బాటింపక యాతనికడకు వెళ్ళుటకే నిశ్చయించుకొనియు మఱల సందేహించి మంత్రులతో సంప్ర

తించుటకై స్వనగరమునకు వెళ్ళి మంత్రులం బిలిపించి యీ సంగతిని వారితోఁ జెప్పి "యిందు మీ యభిప్రాయమేమి" యని యడిగెను.

మంత్రులు కొంతవడి యాలోచించి "రాజోత్తమా! మీ రాతనిని బాఱఁద్రోలి వాని రాజ్యము నపహరించి యుండుటచే వానికి మీరు పరమశత్రువులై తిరి. అట్టివాఁడు శత్రువు చేఁజిక్కినంతనే వధింప యత్నించునే కాని ధర్మములు బోధించి పంపుట కిష్టపడఁడు. కనుక మీ రీ ప్రయత్నము మానుట యుచిత"మని విన్నవించుకొనిరి. రాజు వారి బోధ లనువిని "మంత్రిపుంగవులారా! ఆతఁడుపూర్వపువిరోధమును పాటించి నాతోఁ బోరి చంపునే యనుకొందము. పోరు లోని మరణముకూడ మోక్షమునే యొసంగును. ఆతఁడు ధర్మాత్ముఁడై ప్రాయశ్చిత్తమునే చెప్పిన యజ్ఞమునుముగించి యద్దానివలన మోక్షమును బడయ వీలుకలుగును. మీరు చేయు ప్రబోధము రాజ్యకాంక్షగలవానికేఁగాని నాబోఁటి మోక్షకామికి సరిపడదు. కనుక నేను వానికడకు వెళ్ళుటకే నిశ్చయించుకొంటిని. మీరడ్డుపెట్టకుఁడు" అని వచించి వెంటనే బయలుదేఱి ఖాండిక్యుఁడుండు వనమునకు వెళ్లెను.

ఖాండిక్యుని భటు లీతని రాకను దూరమునుండియే చూచి వెంటనేవచ్చి రాజున కీవార్త నెఱింగించిరి. రాజు మంత్రులతో సంప్రతించి వానితోఁ బోరుటకే నిశ్చయించు కొని సైన్యముతో యుద్ధమునకు సిద్ధపడియుండెను. ఎట్టి దురాలోచనయు లేని కేశిధ్వజుఁడు నిర్భయముగా ఖాండి

క్యుని కడకు వచ్చి నమస్కరించి "అయ్యా! నేనెట్టియకృత్యము చేయుటకును రాలేదు. నా యజ్ఞధేనువును బెబ్బులి చంపుటచే యజ్ఞము చేయుట కాటంకము సంభవించినది. అట్టి యాటంకము తీరుటకుఁ దగిన ప్రాయశ్చిత్తమును వేఁడుటకై నిను కడకు వచ్చియుంటిని. ఈ విషయమున నన్నెంతమాత్ర మనుమానించవలదు." అని యథార్థము విన్నవించి దోసిలొగ్గి నిలచియుండెను. వాని మాటను విన్నంతనే ఖాండిక్యుఁడు సహజ సోదరభావ మినుమడింపఁ జిఱునవ్వుతోఁ బ్రశాంతుఁడై నిలచియుండెను.

మంత్రులీతని ప్రసన్నతను జూచి "మహారాజా! ఈతఁ డేదియో కపటనాటకమాడుటకై వచ్చియున్నాఁడు. ఈతని మాటలు నమ్మవలదు. ఈతనివలననే యింతకాల మీ కానలోఁబడి పలుకష్టముల ననుభవించుచుంటిమి. శత్రువును వధించుట కిదియ సమయము. చేఁజిక్కిన శత్రువును విడచుట రాజధర్మము కాదు. కనుక వెంటనే వానితోఁ బోరి యీ మోసగానిని వధించి రాజలక్ష్మిని గైకొనుఁడు" అని వేఁడుకొనిరి.

ఖాండిక్యునకు వారి ప్రబోధ ముచితముగాఁ దోఁపక "మంత్రులారా! ఎట్టి దుర్మార్గుఁడైనను నెదిరించినపుడు వధించుట ధర్మము కాని తలయొగ్గిన వానిని జంపుట పాడి గాదు. అందును నీతఁడు ధర్మజిజ్ఞాసతో వచ్చియున్నాఁడు. అట్టివానిని జంపుటకంటెఁ బాతకము వేఱొండు కలదే! కనుక వీనికి ధర్మముపదేశించుటయే యుచితము కాని వీనిని-

వధించుట తగదు'' అని చెప్పి వారిని శాంతపఱచి కేశిధ్వజునకుఁ దత్ప్రాయశ్చిత్తవిధానము నుపదేశించెను.

కేశిధ్వజుఁడు సోదరుని యౌదార్యమునకు మిగుల సంతసించి యాతనికి నమస్కరించి యటనుండి బయలుదేఱి యజ్ఞశాలకు విచ్చేసి ప్రాయశ్చిత్తవిధానమును యథావిధిగా మున్ముందు నెఱవేర్చి తర్వాత దీక్షితుఁడై మహా వైభవముతో నిరాటంకముగా యజ్ఞమును బూర్తి గావించి ఋత్విజులకు దక్షిణలొసంగి యజ్ఞమునకు వచ్చిన వారినెల్ల యథోచితముగా సత్కరించి పంపెను.

ఈరీతి నిర్విఘ్నముగా యజ్ఞమును ముగించినను కేశిధ్వజుఁ డేలొకో ప్రశాంత చిత్తుఁడు కాక కలఁతఁ జెంది యుండెను. ఇట్టి కలఁతకుఁ గారణమేమియో యని చాల తడవాలోచించి తుదకు గురుదక్షిణ యీయకుండుటయే కారణమని భావించి, ధర్మబోధకుఁడైన గురువర్యుని కడకేగి నమస్కరించి ''రాజర్షీ! తమ యనుగ్రహమువలన యజ్ఞమును నిర్విఘ్నముగాఁ బూర్తి చేయఁగల్గితిని. యజ్ఞాంగమగు గురుదక్షిణాదాన మొకటిమాత్రము మిగిలియున్నది. అద్దానిని గూడ ముగించుటకై తమ దర్శనమునకు వచ్చియున్నాఁడ. తమ కభిమతమెయ్యదియో తెల్పిన నద్దాని నొసంగి యీ యజ్ఞకర్మను బరిసమాప్తిచేసి కృతార్థుఁడనయ్యెద'' నని వేఁడుకొనెను. కేశిధ్వజుని పల్కులనాలించిన మంత్రులు ఖాండిక్యు నావలకుఁ గొంపోయి ''ప్రభూ! రాజ్యసంపాదనమున కిదియ యదను. అతని రాజ్యమంతటిని గురుదక్షిణగాఁ

గోరు''డని ప్రబోధించిరి. వారి మాటలకు ఖాండిక్యుఁడు సంతృప్తిఁజెందక ''అనశ్వరమైన యీ రాజ్యమును గోరు టేల? కేశిధ్వజుఁడు యోగవిద్యయందు సాటిలేని మేటి. వానినుండి యోగవిద్యను గురుదక్షిణగాఁబడసి యద్దానివలన శాశ్వతానందమును బొందెద''నని యెంచి కేశిధ్వజుని కడకువచ్చి గురుదక్షిణగా యోగవిద్యను బోధింపవలసినదని కోరెను.

వాని కోరికకు సంతసించి కేశిధ్వజుఁడు భక్తి యోగమును వివరముగా బోధింప నారంభించెను. ''రాజర్షి! సర్వదైవతములలో విష్ణువే పరమదైవతము. ఇతర దైవతములకంటె విష్ణువు శాశ్వతానందమునిచ్చు మహాదాత. బ్రహ్మరుద్రాదులు తాత్కాలికానంద మొసంగఁజాలిన వారు. విష్ణుమూర్తి భక్తపక్షపాతియై యెల్లపుడు భక్తుల యభీష్టములను దీర్చుచుండును, బ్రహ్మయును, రుద్రుఁడును శ్రీ మహావిష్ణువును వేఁడియే సృష్టి, లయ కర్తలైరి. ప్రహ్లాద, విభీషణ, గజేంద్రాదులు విష్ణువును ధ్యానించియే కదా శాశ్వతానందమిచ్చు ముక్తికాంతను జేపట్టఁగలిగిరి. కనుక నీవును భక్తియోగముతో భగవంతుని ధ్యానించి మోక్ష సామ్రాజ్యమును బొందుము.'' అని పరతత్త్వ వైభవముం దెల్పి యోగవిద్యోపదేశమనెడు గురుదక్షిణ నొసంగి ధన్యుఁడయ్యెను. ఇట్టి గురుదక్షిణ సమర్పించినంతనే యావత్కాలము కేశిధ్వజుని మనమున నావరించియున్న వ్యాకులత యంతయు నదృశ్యమాయెను. ఈరీతి విష్ణుచిత్తుఁడు పాండ్య

రాజునకు విష్ణుతత్త్వమును బోధించి వానిని పరమ భాగవతోత్తమునిగాఁ జేసెను.

అంత నారాజు పరమానందమొంది విష్ణుచిత్తు నేనుఁగుపై నెక్కించి రాజవైభవముతో నూరేగించి గురుకట్న మొసఁగి వస్తువాహనాదులతో వానిని శ్రీవిల్లిపుత్తూరులోవిడిచిరండని భటుల కాజ్ఞాపింప వారు రాజాజ్ఞను శిరసావహించి ఈ భాగవతోత్తముని పల్లకిలో నెక్కించి వాని నగరమునకుఁ దీసికొని వెళ్లుచుండిరి. దారిలో శ్రీమహా విష్ణువు గరుడవాహనారూఢుఁడై తన భక్తునకుఁ బ్రత్యక్ష మాయెను. అంత నాతఁడు పల్లకినుండి దిగి భగవంతుని పాదపద్మములపైఁబడి యనేక విధములఁ బ్రస్తుతించి భక్తి పారవశ్యమునఁ దన్మయుఁడయి యుండెను.

అట్టితఱి భగవంతుఁడు విశ్వకర్మను రావించి "ఓ శిల్పి! యీతఁడు రాజుగారిచ్చిన ధనమును నాయాలయ ప్రాకారాదులకే వినియోగించి బీదవాఁడగును. కనుక నీవు ముందుగా వెడలి యీతని గృహము మణిమయము గావింపుము" అని యాజ్ఞాపించెను. వెంటనే యా శిల్పి శ్రీవిల్లిపుత్తూరునకు వెడలి తన ప్రభావముచే నా భక్తుని కుటీర మును రత్నాలసౌధముగా నొనర్చి వెడలిపోయెను.

విష్ణుచిత్తుఁడు తెప్పరిల్లిన పిదప విష్ణువాతని నోదార్చి యంతర్ధానమయ్యెను. విష్ణుచిత్తుఁడు భగవంతుని దర్శనమున కెంతయు సంతసించి యా దేవదేవునే మనమున ధ్యానించుచు రాజపరివారము వెంటరాఁగాఁ బల్లకిలో నెక్కి తన గ్రామ

మునకు వెడలి ముందుగా మన్నారుస్వామి యాలయమునకే దారి తీసి పోవ నాజ్ఞాపించెను. ఈ వృత్తాంతము నాలయాధికారులు తెలిసికొని స్వామివారి పరికరములతో నెదురుగా వచ్చి తోమాలనొసంగి యాలయమునకుఁ దీసికొని వెళ్లిరి. ఆతఁడు గోపురద్వారముకడనే పల్లకిదిగి దేవాలయములోనికి వెడలి భగవంతు ననేకరీతుల స్తుతించి స్వామివారి తీర్థప్రసాదములను స్వీకరించి యటనుండి బయలుదేఱి తన గృహమునకు వెళ్లి చూచునప్పటికిఁ దన కుటీరము రత్నసౌధముగా మాఱియుండెను. అది భగవంతుని దయవలనఁ బ్రాప్తించినదేయని తలఁచి యా గృహములోఁ బ్రవేశించి పూర్వముకంటె నధికముగ భగవద్భాగవతకైంకర్యము చేయుచుండెను.

ఈరీతిఁ గాలము గడచుచుండ నొకనాఁడు విష్ణుచిత్తుఁడు దేవుని పూలతోఁటకు వెడలి పలువిధములైన పుష్పములను గోసి, తులసిదళములను గోయుటకై తులసివనమునకు వెళ్లిచూచునప్పటికి సర్వాంగ సౌందర్యముతో దేదీప్యమానముగాఁ బ్రకాశించుచున్న యొక బాలిక కన్పించెను. విష్ణుచిత్తుఁ డాబాలికను గాంచి యామె సౌందర్యమునకచ్చెరువొంది 'నేనుసంతానహీనుఁడననితలఁచి నాయందనుగ్రహముచే మన్నారుస్వామి నాకీ బాలికను బ్రసాదించి యుండనోపు' నని తలంచి యా బిడ్డనెత్తుకొని వెళ్ళి తన భార్యకిచ్చెను. ఆమెయు నిట్టిబాలిక లభించుట తమ పూర్వ పుణ్యవిశేషముగ భావించి మిగుల సంతసించు

చుండెను. అంత నాదంపతు లొక శుభముహూర్తమున నామకరణమహోత్సవము జరిపి గోదాదేవి యను పేరిడి యల్లారుముద్దుగఁ బెంచుచుండిరి. ఆమె దినక్రమమునఁ బెరిగి పెద్దదియై సమస్తవిద్య లభ్యసించి సుగుణవతియని లోకులచేఁ బొగడ్త కెక్కెను. ఈమె యౌవనవతియైన పిదపఁ జెలికత్తియలతో నుద్యానవనమున విహరించుచుఁ, దానును దండ్రివలెనే భక్తితత్పరయై స్వామివారి కైంకర్యము సేయుచుఁ గాలము గడపుచుండెను.

ఈమె చెలికత్తెలతోఁ గూడి యుద్యానవనమున విహరించునపుడు వారు విష్ణుకల్యాణగుణములం దెల్పుపాటలు పాడుచుండెడివారు. ఆ పాటలలోని పురాణపురుషుని గుణగణములను విని గోదాదేవి యా దేవునియందే మక్కువ కలదియై వివాహమాడుట కువ్విళ్లూరుచుండెడిది. విష్ణుచిత్తుఁడు స్వామికైంకర్యమునకై పూలదండలు కట్టి గూడబుట్టయందుంచఁగా గోదాదేవి చూచి వానిని ముందుగాఁ దలయందు ముడుచుకొని నీటిలోఁ దన యందముఁ జూచి మురిసికొనుచు నా విష్ణుమూర్తి యెప్పుడు తన కోర్కె యీడేర్చునాయని లోలోన విచారించుచుఁ గొంత తడవుండి యా దండలను దీసి మరల గూడబుట్టయందుంచి దాని నెప్పటిచోటఁ బెట్టియుండెడిది. దేవుని పూజాకాలమునకు విష్ణుచిత్తుఁ డా దండలను దీసికొని వెళ్ళి దేవుని కర్పించుచుండెడివాఁడు. ఆ భక్తరక్షకుఁడు గోదాదేవి ధరించి తీసిన పూలమాలల నధిక ప్రేమతో ధరించి యపరిమితా

నందమందుచుండెను. భగవంతుఁడు భక్తపరాధీనుఁడగుటచే భక్తురాలు ధరించిన మాలలు తన కాహ్లాదము కలిగించినవి. శ్రీరామచంద్రుఁడు శబరి యొసఁగిన యెంగిలి పండ్లను మెసవి పరమానంద మొందలేదా! శ్రీకృష్ణుఁడు కుచేలుని గోచిచెఱఁగునకు మూటకట్టఁగాఁ జెమటకుఁ దడిసిన యటుకుల నడిగి తిని సంతసమును బొందలేదా? ఈనాఁడు భక్తురాలును, కానున్న ప్రియురాలు నగు గోదాదేవి తలఁదాల్చి తీసిన దండలను ధరించి పరమానంద మొందుటలో సందేహమేమి?

ఈయమ భగవద్వియోగమును సహింపఁజాలక చెలికత్తెలపజ్జఁ జేరి యా మనోహరుని రూపసంపదను, కల్యాణగుణములను పదేపదే ముచ్చటించుచుండ వార లామె యభిప్రాయమును గనిపెట్టి యీమెకుఁగల విచారమును బోఁగొట్టఁ దలఁచి "ప్రియసఖి! ఈ విచారమేల? నీకు శ్రీహరియే ప్రాణవల్లభుఁడు కాఁగలఁడు. ఇందసత్యమేమియు లే"దని యోదార్ప నారంభించిరి. ఆమె సిగ్గుచేఁ దలవంచినదయ్యు వారు చెప్పుమాటలను వినుటయం దెక్కుడనురాగముకలదియై "ఓహో! మనసులోనియభిప్రాయమును గనిపెట్టుటలో మహార్హులైతిరి సుమా! అట్లయిన సరియే కాని నా పూర్వజన్మ వృత్తాంతమేమియో చెప్పుఁడు చూతము" అని యడిగెను.

ఆ చెలికత్తెలలో మాటనేర్పరియగు మాలతి "ప్రియసఖి! అడిగితివిగాన చెప్పెద నాలింపుము. నీవు పూర్వ

జన్మమున శ్రీకృష్ణుని పాదముతో సత్కరించిన సత్యభామవు కాదా!" అని చెప్పెను. "నేను సత్యనేనైన మీ రెవరో తెల్పుఁడు." "మే మెవర మో యని తెలంపకుము. నీవు సత్యభామవై యున్నపుడు నీకు సఖులమై యెల్లపుడు సేవలు చేసి మెప్పువడసిన నాగకన్యకలము. నీతోఁ బాటుగ మేమును నీ పట్టణముననే జన్మించి నీకు సఖులమైతిమి" అని పూర్వస్మృతివలన సర్వము నెఱింగించి యాలేమ కచ్చెరువు **కలిగించెను.**

అపుడు గోదాదేవి "సఖులారా! అట్లైన నే నీజన్మలోఁ గూడ శ్రీ హరినే వివాహమాడుదునుగాని యన్యుని వివాహమాడనొల్ల. ఆ లోకరక్షకుఁడు నన్నంగీకరింపకున్న ప్రాణములు విడనాడుదాన. ఇదియే నా మనోనిశ్చయ" మనుచు వచించెను. చెలికత్తియ లామె మనోనిశ్చయమును విని "సఖీ! నీ కోరిక యెంతయు నుచితముగానే కన్పట్టుచున్నది.. నీవట్లు భగవంతునే వివాహమాడితివేని మాకును నాపరాత్పరుని సేవించుభాగ్యము లభింపఁజేసినదానవగుదువు. మా జన్మయుఁ దరించును" అని పలికిరి. "సఖులారా! శ్రీహరి నాకెట్లు లభించఁగలఁడో యానతిచ్చి నన్ను ధన్యురాలిం జేయుఁడు" అని దీనముగా నడిగెను. సఖు లామె పల్కుల కలరి "అమ్మా! అలనాటి శ్రీకృష్ణుఁ డీ యుగమున శ్రీరంగక్షేత్రమున భక్తులకోర్కెలీడేర్ప రంగనాథుఁడుగ నవతరించియున్నాఁడు. ఆ భగవంతుఁడు భక్త సులభుఁడు. రంగనాథుని నీవు నిశ్చలభక్తితో నారాధించితివేని యా

మహనీయుఁడు ప్రసన్నుఁడై నీ వాంఛిత మీడేర్పఁగలఁడు. ఇదియే సులభోపాయము'' అని భగవత్ప్రాప్తికి మార్గముం దెల్పి మిన్నకుండిరి. గోదాదేవియు వారి మాటలయందు నమ్మకముంచి యట్లే చేయుటకు నిశ్చయించుకొనెను.

అటనుండి గోదాదేవి శ్రీవిల్లిపుత్తూరునందలి మన్నారుస్వామినే శ్రీ రంగనాథుఁడుగ భావించి యుద్యాన విహారాదులు సైతము మాని యా భగవంతునే యెల్లపుడు ధ్యానించుచు, వానిపాటలే పాడుచుఁ గాలముగడపుచుండెను. ఎంతకాలమునకును శ్రీ రంగనాథుని దర్శనము కాక యుండుటకు మిగుల వగచి యాహారమునుగూడఁ గైకొన నొల్లక నానాటికిఁ గృశింపనారంభించెను. ఈమె ప్రతిదినము సూర్యోదయము కాకమునుపే లేచి తనయుద్యానవనములోని సరస్సునకు వెడలి స్నానమునుచేసి మడుగు వస్త్రములను ధరించి, తిరుమణి శ్రీచూర్ణములను నొసటఁగీలించి యింటికి వచ్చి చెలికత్తెలు సిద్ధము చేసియుంచిన పూల మాలలను గైకొని యాలయమునకు వెడలి వానిని స్వామి కర్పించి యా రంగనాథునే మనమున ధ్యానించుచు స్వామివారికి నైవేద్యము జరిగిన పిదప తీర్థప్రసాదములను స్వీకరించి యట నుండి తనయింటికి వచ్చుచు నీ రీతి రంగనాథుని సేవయందే నిమగ్నురాలై యుండెను.

విష్ణుచిత్తుఁడు తన బిడ్డ యీ రీతి కృశించుటకుఁ గారణ మారయఁజాలక, బిడ్డ నెన్ని విధముల నడిగినను జెప్పకుండుటచే మన్నారుస్వామినే యడిగి తెలిసికొన నిశ్చ-

యించి దేవుని సన్నిధానమున కేగి "దయామయా! తమ దాసియగు గోదాదేవి యన్నపానములను మాని యేదియో వ్రతము చేయుచున్నది. ఆమె వ్రత మెద్దియో తెలియకున్నది. ఆమె నానాటికిఁ గృశించుట చూడ నా మనస్సు కలఁతఁ జెందుచున్నది. ఆమెకు నాపైఁ గోపమువచ్చినదా? నేనేమి యపకారము జేసితిని? ఆమె యట్లు జీవితముపై నిరాశ చేసికొనుట కంతటి కారణ మేమి వచ్చినది? స్వామీ! మీ రామెకలఁతకుఁగల కారణమంతయుఁ దెల్పి నా మనోవేదనను బోఁగొట్టుఁడు" అని దీనముగాఁ బ్రార్థించుచుండెను.

ఆతఁ డా రీతి దీనముగా వేఁడుటకు భగవంతుఁడు జాలిఁబొంది "ఓయీ! విష్ణుచిత్తుఁడా! నెఱవకుము. ఆమె రంగనాథుఁ డను పేరుతో శ్రీరంగముననున్న నా యందు మక్కువ కలదియై నన్నే వివాహమాడ నిశ్చయించుకొని యీ రీతి విరహబాధ నొందుచున్నది. ఈమె కృశత్వమున కంతకన్న వేఱేమియుఁ గారణములేదు. నీవు భయపడక పొమ్ము" అని వచించెను. విష్ణుచిత్తుఁ డా మాటలు నాలించి "ఔరా! యీ బిడ్డ మానవమాత్రుని కాక భగవంతుని వివాహమాడఁ గోరుటేల? ఇది దుస్సాధ్యము కదా? ఈమె కోరిక నే నెట్లు తీర్పఁజాలుదును?" అని చింతాక్రాంతుఁడై యేమియుఁ దోఁచక నిశ్చేష్టుఁడై యుండెను. భగవంతుఁడాతని విచారము నెఱిఁగి "ఓయీ! ఇది యెట్లు సాధ్యమగువా యని భయపడకుము. భగవంతుఁడు భక్తపరా

ఛేనుఁడను సంగతి నీ వెఱుఁగనిది కాదు. ఆ బిడ్డ **రంగ నాథుని పాటలనే పాడి, వాని గుణములనే మననము చేసి** యుండుటచే రంగనాథుఁడే తన భర్త కావలెనని కోరు చున్నది. ఇఁక నితర నామములు కల యే దేవునైనను నామె కన్నెత్తియైనఁ జూడదు. కనుక ఆమెను శ్రీరంగము నకుఁ గొంపోయి యా దేవుని మనసార ధ్యానించితిరేని రంగనాథుఁడు తప్పక ప్రసన్నుఁడై యామె కోర్కె-లీడేర్పఁగలఁడు. ఇందు సందియ మొందకుము. పూర్వ మొక చండాలుఁడు పరమభాగవతోత్తముఁడై భక్తితో నాపురాణ పురుషుని నుతించి యభీష్టసిద్ధిని బొందియుండెను. కనుక నీవును నీ బిడ్డతోఁగూడ శ్రీరంగమునకు వెళ్ళవలసిన'' దని చెప్పెను. భగవంతునిమాట లాలించిన విష్ణుచిత్తుఁడు ''స్వామీ! ఆ చండాల భక్తుఁ డెట్లు భజనచేసి తన కోరిక లీడేర్చుకొనెనో యా మహనీయుని చరిత్రమును సమగ్రముగ వినిపించి నన్ను ధన్యుంజేయుఁ'' డని సవినయముగా వేఁడు కొనెను. అంత మన్నారుస్వామి యా చండాల భక్తుని చరిత్ర మిట్లు చెప్ప నారంభించెను.

''పూర్వ మొక పల్లెయందు చండాలకుటుంబమున నొక విష్ణుభక్తుఁడు జన్మించెను. ఆతఁడు పుట్టుకతోడనే భక్తి ప్రపత్తులు కలిగియుండెను. ఆఱేఁడు వత్సరములు వచ్చినప్పటి నుండియు విష్ణుమూర్తిపాటలు పాడుచు, మూఢనమ్మకముతో తాళ్ళను బట్టుకొని యాటలాడుచుండెడివాఁడు. ఇంకను పెరిగి పెద్దవాఁడైన పిదప నింటిపనులు సైతము చేయుట

మాని విష్ణుమూర్తినే యహోరాత్రములు ధ్యానించుచుఁ బదిమందిని జేర్చి యా దేవుని గుణములను జెప్పుచు నానంద పడుచుండును. ఈ విధముగా నిల్లు వాకిలి పట్టక తిరుగు చుండుటకు ఇంటిలోనివారును, నిరుగుపొరుగువారును నిట్టిపని తగదని యనేకవిధముల బోధించినను నాతఁడు వినక తన ధోరణిలోనే యుండుట చూచి యెల్లరును దిట్ట మొదలిడిరి. ఈ తిట్లు పడఁజాలక యింటికడనున్నచోఁ దనభక్తి కొటంక ముగ నుండునని యెంచి యుదయముననే లేచి యింటిలో నున్న చద్దియన్నమును దిని చూపల్లెకు సమీపముననుండు నరణ్యమునకు వెడలి యందొక చోటఁగూర్చుండి పగలంతయు నిష్ఠానుసారముగ భగవంతుని ధ్యానించి ప్రొద్దు గ్రుంకువేళ కింటికివచ్చి యన్నము తిని తండ్రికిఁ గనుపడకుండ నే మూలనో పండుకొనుచుఁ గాలము పుచ్చుచుండెను.

ఇట్లుండ నొకనాఁ డా దాసరి యడవులలోఁ బాటలు పాడుచుఁ దిరుగుచుండఁగా దట్టముగా నల్లుకొనిన పొదల చాటున నొక దేవాలయము కన్పించెను. ఆతఁడు వెంటనే యా దేవాలయములోని కేగి చూచునప్పటికిఁ దాను పాడు పాటలలో వర్ణింపఁబడినరీతిగానున్న దేవునిగాంచి "నాతండ్రీ! యీ నాటికిఁ గన్పడితివా! నాయం దిప్పటికి దయకలిగెనా? ఇన్నాళ్ళనుండియు నీ దివ్యమంగళ రూపము కన్పింపక యెంతయో వేదన పడితిని. ఇఁక నీ రూపము చూడఁజాలనని నిరాశ చెందితిని. అబ్బా! యిప్పటికి నా మీఁద కనికరము

కలిగినదిగదా?'' యనుచుఁ గన్నారఁగాంచి, మనసార ధ్యానించి, చేతులారఁ బూజించి యింటికి వెళ్లెను.

అటనుండి యీ దాసరి ప్రతిదినము నొసట పట్టెవర్ధనములను బెట్టుకొని. చముఱుపూసిన చొక్కాయ తొడిగి. తోలుజంగెమును ధరించి. మెడలోఁ దులసిపూసలు వేసికొని, చెవులకు శంఖచక్ర కుండలములను గీలించి యొకచేతఁ జిట్టితాళములను, వేఱొక చేతఁ దంబురను బట్టుకొని, కాళ్లకుఁ బావుకోళ్లుతొడిగి పాటలుపాడుచుఁ జిందులు త్రొక్కుచుఁ గోళ్లుకూయునపుడే లేచి వెడలుచుండెడివాఁడు. ఈతని వేషమును, భక్తితన్మయత్వమును జూచి ప్రజలు వెనుకటి కోపమునుమాని యధికముగఁ బొగడ నారంభించిరి. ఈతఁడీ కులమును బునీతముచేయుటకు జన్మించిన మహానుభావుఁడని మెచ్చుకొనుచుండిరి. ఈతని దర్శనము మోక్షదాయకమని తలఁచి ప్రతి నిత్య మాతనిని దర్శించుచుండిరి.

ఈరీతిఁ గొన్నిదినములు జరుగఁగా నొకనాఁడర్ధరాత్రమునఁ గోళ్లగూటిలోనికి పిల్లి ప్రవేశింపఁగా నా గూటియందలి కోళ్ళన్నియుఁ గూయ నారంభించెను. దాసరి తెల్లవార వచ్చినదని యెంచి వెంటనే లేచి యథారీతిగా వేషమును ధరించి దేవాలయమునకు వెళ్ళుచుండెను. చీకటి దినములగుటచే నా యరణ్యమంతయు గాఢాంధకారముగా నుండెను. ఆ చీకటిలో దారితప్పి యెంతయో దూరమేగెను. కాని యాలయమే కన్పింపదాయెను. ఆవిధముగాఁ దెల్లవారు వఱకు నడచి నడచి యొక మఱ్ఱిచెట్టును సమీపించి చూచు

నప్పటి కాచెట్టుక్రింద నెముకల ప్రోగులు, చచ్చినశవములు, అస్థిపంజరములు, తలపుఱ్ఱెలు కన్పించెను. వానిం గాంచి దాసరి ''దైవమా! దారి తప్పి యీభయంకర ప్రదేశమునకు వచ్చితిని గదా! ఎటుపోవను దిక్కు తోఁచకున్నది. ఇఁక నేమి చేయుదును?'' అని విచారించుచుండ నొక మూలనుండి బ్రహ్మరాక్షసి యొకటి యఱచుచు వచ్చెను. అది మొల త్రాటిలో శవములను దాఁపుకొని, చీకట్లు కలిగించు నల్లని దేహకాంతికలిగి, యెఱ్ఱనిదుప్పటి కప్పుకొని భయంకరముగా నుండెను. అది భేతాళగ్రహములను దిట్టుచు నోరు తెఱచి యూ దాసరిమీఁదఁ బడెను. ఆతఁడును భయపడక భగవన్నామము చేయుచు బ్రహ్మరాక్షసితోఁ బోరాడ నారంభించెను. దాసరియు బలవంతుఁడగుటచేత నెంతకాలమునకును లోఁబడక పోరాడుచునే యుండెను. అపుడా బ్రహ్మరాక్షసి కోపముతో మండిపడి భేతాళగ్రహములను బిలిచి వానితోఁగూడి యాభక్తుని ముట్టడించి, తన్నియుఁ బొడిచియు గుద్దియు లోఁగఁదీసి మఱ్ఱిక్రింద కీడ్చుకొనిపోయి ''ఓరి! మదాంధా! నాతోడనే పోరుటకు సిద్ధపడితి వటరా! నీ కన్నులు పెఱికి కాకులకు వైచెదనుచూడు''మనుచు బెదరించి ''భూతములారా! వీనిని నఱకుటకు గండ్రగొడ్డలిని, రక్తము పట్టుటకు బానను దెం''డనుచు నఱవఁ దొడంగెను.

ఆ యఱపులకు దాసరి యిసుమంతయు బెదరక తనకా భగవంతుఁడే దిక్కని నమ్మి ''ఓ పిశాచరాజమా! నేను నీ కాహారమైతినేని యీ నీచజన్మను విడచుట, యొక

జంతువునకుఁ దృప్తి కలిగించుట, మోక్షముఁ బడయ్యఁ గలుగుట యను మూఁడు ప్రయోజనములు కల్గునుగాన తప్పక నీ కాహారమయ్యెదను. ఇందు సందియ మేమియు లేదు. కాని నన్ను జంపినందువలనఁ గలుగు పాతకము నిన్ను బాధించునేమో యని మాత్రము జంకుచున్నాఁడను'' అని చెప్పెను. వాని మాటలకా రక్కసుఁడు నవ్వుచు నిట్లు పలుక నారంభించెను.

బ్ర. రా:—ఓరీ మోసకాఁడా! ఇట్టిమాటలచే నన్ను మోసపుచ్చఁ జూచెదవటరా? ఇట్టి ధర్మపన్నములు నే నెఱుఁగనివి కావు. మా యాచారము ననుసరించుట మాకు ధర్మమేకదా! కులాచారమును గూలఁదన్నుట ధర్మము కాదు. హింసను చేయుట మా కులాచారము. కనుక నిన్నిపుడే చంపి కడుపార నారగించి సంతృప్తిఁజెందెదను.

దాసరి:—ఓ రాక్షసీ! నేమోసకాఁడనుగాను. నిజమే చెప్పుచున్నాఁడను. నీ యాత్మను దృప్తిపఱచుటయే నా నిశ్చితాభిప్రాయము. కాని యొక ప్రార్థనమాత్రము కలదు. అద్దానిని నెఱవేర్చి పిదప నన్నుదినుము.

బ్ర. రా:—ఓయీ! వినువారున్న నిట్టి ప్రార్థనలెన్నియైన వచ్చుచునే యుండును. జాగుసేయక అది యెద్దియో తెల్పుము.

దాసరి:—ఆర్యా! ఈ యరణ్యములో నిత్యనివాసము కల్పించుకొని భక్తులకు సర్వకాలములయందు దర్శన మొసంగుచుండు శ్రీహరిని బ్రతినిత్యము పూజించు నల

వాసుకి లేదు. కనుక ఇప్పుడే వెడలి యాభగవంతుని గడసారి దర్శించి నినివితీర ధ్యానించి వచ్చి నీ కాహారమయ్యెదను. ఇదియే నా ప్రార్థనము.

బ్ర. రా:—ఓహో! మంచి ప్రార్థనమే చేసితివి. ఈ విధముగా నన్ను వంచించి పోవ నెంచితివటరా? ఇట్టి యాగడములు నాకడసాగవు. హరి లేడు గిరి లేడు, ఎక్కడికి వెళ్ళెదవు? నిలువుము.

దాసరి:—రాక్షసరాజా! నే నాడి బొంకువాడను గాను. ప్రమాణపూర్తిగఁ జెప్పుచున్నాఁడ. నాయీప్రార్థన మాలించి భగవంతుని సేవించివచ్చుట కనుజ్ఞ యిండు. నేను తిరిగిరాక తప్పితినేని భగవంతుని పాదములకుఁ దప్పిన వాఁడ నగుదును.

బ్ర. రా:—ఇవి యెక్కడిమాటలు? మృత్యుముఖము నుండి తప్పించుకొని వెడలినవాఁడు తిరిగి మృత్యువునోటఁ బ్రవేశించుట కిచ్చగించునా? చాలుఁ జాలు. నీమాటలు నే నమ్మఁజాలను.

దాసరి:—అయ్యా! నేనింతకన్న నేమని ప్రార్థింతును? మీకు నా ప్రార్థనమున నమ్మకమున్న వదలుఁడు. లేకున్నఁ బట్టి వధించుఁడు.

వాని దీనాలాపములను వినిన యా రక్కసుఁడు "రూపమునుబట్టియు, మాటలనుబట్టియుఁ జూడ నీతఁ డసత్యమాడువాఁడుగఁ గన్పింపఁడు. కనుక భయపడవలసిన పని

లే"దని నిశ్చయించుకొని "ఓయీ! యింతగఁ బ్రార్థించు చుంటివిగాన నీ మాటలయందు నమ్మకముంచి పంపు చున్నాఁడను. ఎంతకాలములో నా భగవంతుని సేవించి తిరిగి వత్తు"వని యడిగెను. రెండు గడియలలో నే తిరిగి రాఁగల్గుదు నని దాసరి సమాధానము చెప్ప నందులకంగీకరించి పంపెను. అంత నాతఁడా యాలయమునకు వెడలి దేవదేవుని దర్శించి మనసార ధ్యానించి యాటలతోను, పాటలతోను నాభక్తసులభుని సేవించి వెంటనే మఱలి యారక్కసుని కడకు వచ్చి "దయామయా! మీ కరుణవలన నా యిష్ట దైవమును గనులారఁగాంచి, మనసార ధ్యానించి వచ్చితిని. ఇఁక నాకెట్టి కొఱఁతయు లేదు. నన్ను శీఘ్రముగాఁ జంపి భక్షించి మీ యాఁకలిని బాపుకొనుఁడు" అని వేఁడుకొనెను. ఆ బ్రహ్మరాక్షసుఁడు వాని రాక కచ్చెరువొంది ప్రసన్నుఁడై వానితో నిట్లు ముచ్చటింప నారంభించెను.

బ్ర. రా:—భక్తాగ్రేసరా! నీవు నిజముగ సత్యసంధుఁడవు. నీతిమంతుఁడవు. పుణ్యచరిత్రుఁడవు. నీ వంటివాని నెన్నఁడును జూచి యుండలేదు. నే నింతకాలమునుండి దుర్మార్గుఁడనై యనేకమందిని జంపి తినుచు ఘోరపాతకమును మూటఁ గట్టుకొంటిని. ఇప్పుడు మీ దర్శనమైనంతనే క్రూరస్వభావ మంతరించినది. ఇట్టి పుణ్యాత్ముల శరీరమును తినుటకు నే నెంతమాత్రము నంగీకరింపను. నన్ను క్షమించుము.

దాసరి:—అయ్యా! మీరు నన్ను దినకుంటిరేని, నోటి దగ్గరి యన్నము దీయువాఁడు పోఁదు మహాపాతక మును బొందుదును. ముందు నా యంగములన్నియు యథా రీతిగ నున్నవేమో పరిశీలించి నన్ను భక్షించి ధన్యుం జేయుఁడు.

బ్ర. రా:—మహానుభావా! మీరట్లు నన్ను నిర్బం ధింపవలదు. నేను మహాపాతకిని. మీ యనుగ్రహము వలన నా పాతకములను బోఁగొట్టుకొని తరింపఁ దలఁపుఁ గొనియున్నాఁడ. మీరు దయయుంచి యే తీరుననైన నా పాపములఁ బోనడచి నన్ను ధన్యుం జేయుఁడు.

దాసరి:—అయ్యా! మానవ మాత్రుఁడనగు నా కది యెట్లు సాధ్యమగును! నే నా భగవంతుని ధ్యానించు పాటలు పాడి వినిపించెదను, వినుఁడు. (అనికొన్ని పాటలు పాడును.)

బ్ర. రా:—ఈ పాటలను వినుటవలన నా జీవితము ధన్యమైనది. ఇఁక నాకు ముక్తి మార్గము నుపదేశింప వేఁడుచున్నాను.

దాసరి:—ఈ దీనుని కట్టి శక్తిలేదని యీ వఱకే మనవి చేసికొంటినిగదా!

బ్ర. రా:—అట్లనకుఁడు. శ్రీమహావిష్ణువు ఘోర కార్య ములను జేసి దేశమంతటిని నల్లకల్లోలముచేసిన ఘంటాకర్ణాది రాక్షసులకు మోక్షమిచ్చి కాపాడలేదా? నన్ను వదలి నా భక్తుని వేఁడుమని శ్రీ కృష్ణపరమాత్మ చెప్పియుండలేకదా? భక్తులైన మీరు నా పాపములను బోఁగొట్టలేకుందురా!

మీరు తలఁచితిరేని నా యీ ఘోర దానవరూపము తప్పక తొలఁగిపోఁగలదు.

దాసరి:—ఆర్యా! మీ దానవరూపముపోవుటకు మార్గ మెద్దియో తెల్పుము. అది నాకు శక్యమేని అట్లే చేయుదును.

బ్ర.రా:—నీ విపుడు పాడిన పాటయొక్క ఫలమును నాకు ధారాదత్తము చేసితివేని నా యీ క్రూర దానవ రూపము తొలఁగిపోఁగలదు. అందువలన నా పాపము తీరుటయకాక నీ ప్రాణముకూడ దక్కును

దాసరి:—రాక్షసోత్తమా! ఈ పాడు శరీరమున కాసపడి నా హరిభక్తిని ధారపోయనొల్లను.

బ్ర.రా:—సముద్రములోని జలము గ్రుక్కెఁడు మ్రింగినంతమాత్రాన నందలిజలము కొఱవడనిరీతి నాక పాటలోని ఫలమొసంగినంత మాత్రముననే నీ భక్తికి లోపము కలుగఁజాలదు. పూర్తిఫలమొసఁగినకొఱఁతపడుననితలంచితి వేని సగము ఫలమైన నొసంగి నన్ను గడతేర్పుము.

దాసరి:—దానవోత్తమా! ఇట్టి మాటలు చాలించి నన్ను వెంటనే మ్రింగి నా జన్మ సఫలము చేయుము.

బ్ర.రా:—భక్తశిఖామణీ! నీ శరీరమును దిననొల్లని నన్నీరీతి బలవంత పెట్టెదవేల? మహాభక్తులెందఱు లోకోప కారార్థము పాపులకుఁ దోడ్పడి వారి పాపపుంజములను బటాపంచలు చేయలేదు? నీ వీ దీనునకు సాయముచేయ నేల యంగీకరింపవు? భాగవతోత్తమా! సందియమందక యీ పాటలోని నాలవవంతు ఫలమునైన నొసంగి కాపాడుము.

దాసరి:—అయ్యా! నా శరీరమునైన వదలెదనుగాని నా భక్తినిమాత్రము వదలఁజాలను. నన్ను నిర్బంధింపకుము.

బ్ర.రా:—అట్లా పాటలోని ఫలము నొసంగఁజాలకున్న చరమగీతములోని ఫలమునైన నొసంగి నన్ను గడతేర్పుము. (పాదములపైఁ బడును.)

దాసరి:—అయ్యా! నీవెవఁడవో యుత్తమ కులజుఁడవుగఁ గన్పించుచున్నావు. నీ విట్లు హీనకులజుఁడనైన నా పాదములపైఁ బడుట ధర్మము కాదు. లెమ్ము.

బ్ర.రా:—నీవు తలఁచినట్లు నేను పూర్వజన్మమున నగ్రజాతిలో జనించినవాఁడనే. కులముతోనేమి? గుణము కదా ప్రధానము? కర్మచేత నీకు బ్రాహ్మణత్వ మబ్బినది. కనుక నీవు నమస్కారార్హుఁడవే. సందియ మొందకుము. నీ వా గీతములోని ఫల మొసంగినఁగాని నేను లేవను.

దాసరి:—ఆర్యా! అట్లేయొసంగితిని. లెమ్ము. కాని బ్రాహ్మణుఁడవైన నీకీ రాక్షసరూప మేల సంప్రాప్తమయ్యెనో వచింపుము. వినఁ గుతూహల మగుచున్నది.

బ్ర.రా:—నీకు వినఁ గుతూహలమైన నట్లే చెప్పెద నాలింపుము.

చోళదేశమున నొక బ్రాహ్మణాగ్రహారము కలదు. అందుఁ గల యొక శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబమున నేను జన్మించి, సమస్తవిద్యల నభ్యసించి, వాదములలోఁ గొమ్ములు తిరిగిన పండితులనుగూడ జయించి ప్రసిద్ధి

కెక్కితిని. కొంతకాలమునకు నాకు యజ్ఞము చేయవలెనను తలంపు గలిగి యందులకు వలయు ధనము సంపాదింపనెంచి యెంతయో శ్రమపడితినిగాని ప్రయోజనము లేకపోయెను. అపుడు దేశాంతరము వెళ్ళి ధనము సంపాదింపఁదలఁచి యొక శిష్యునితోఁగూడ బయలుదేఱి మధురాపురమునకు వెళ్ళి యచ్చట వెలిబెట్టఁబడిన బ్రాహ్మణులకుఁ బ్రాయశ్చిత్తములను జేయించి వారితోఁ గలిసి భుజించియు, బ్రాహ్మణార్థములు చేసియు, దానములు పట్టియు నెక్కుడు ధనము సంపాదించి యా ధనము నొక వైశ్యునకు వడ్డికిచ్చి యద్దానిని వృద్ధి పొందించుచుంటిని

ఇట్లు కాలముగడపుచుండగా స్వదేశమునకు వెళ్లఁ దలంపుకలిగి, తలయంటిపోసికొని క్రొత్తవస్త్రములను, చెప్పులను గొని ధరించి భార్యకుఁ జీరెలు రవికెలు కొనఁ దలంచి బజారునకు వెళ్ళి యంగళ్ళలో జేరముచేసి తుదకొక యంగడిలోఁ గావలసిన వస్త్రములను గొంటిని. అంతట నింటికివచ్చి వానిని భద్రపఱచి యా వైశ్యునికడకు వెళ్ళి వడ్డితోసహా నేనిచ్చిన ధనమంతటిని బుచ్చుకొంటిని. వాని నన్నిటిని నొక మూటగట్టి యానాఁటి వేఁకువజామున శిష్యుఁడు వెంటవచ్చుచుండగా వర్తకులగుంపుతో బయలుదేఱి ప్రయాణము చేయుచుంటిని. ఈ యార్భాటమంతటిని నొక దొంగచూచి నాధనము నపహరింపఁదలఁచి మాతో వాఁడును బ్రయాణమై వచ్చుచుండెను. ఆ పగలంతయుఁ బ్రయాణము చేసి రాత్రియగునప్పటి కొక గ్రామము చేరి యందొక సత్రమున

నెల్లరము పడుకొంటిమి. అర్ధరాత్రసమయమున నందఱము గాఢముగా నిద్రించుచుండ నాదొంగ లేచి దొంగలు దొంగలనుచుఁ గేకలు పెట్టెను. ఎల్లరుఁ దత్తరపాటుతోఁ బాఱిపోవ నారంభించిరి. నేనును నా మూటనెత్తికొని వారి వెంటనే పరుగిడితిని. అంత నా దొంగ ఇటు ఇటు అనుచు మాఱు త్రోవన నొక వాగుకడకుఁ దీసికొనిపోయి యీలవేయఁగాఁ జాటున దాఁగియున్న దొంగలందఱు ముట్టడించి యెల్లరి ధనములు దోచుకొనిరి. ఒక చండాలుఁడు నన్ను వెంబడించి తఱిమి నా మూటను దొంగిలించుకొని పోవుచుండగా నాన వాలుపట్టి "ఓరి! పోలిగా! మాయూరివాఁడవైన నీవే యీ పని చేసితివటరా. రేపు చూతువులే పొమ్ము" అనునప్పటికి వాఁడు భయపడి నన్ను గత్తితోఁ బొడువవచ్చి యాసమయమునకుఁ దెల్లవారుటచే నామార్గమునవచ్చుచున్న జనమును జూచి తొందరపాటుతోఁ బెడపోటుపొడిచి పాఱిపోయెను. ఆదారిన వచ్చువారిలో నా బావమఱఁదియుఁ గలఁడు. అతఁడు మెల్లగా నా యింటికిఁ జేర్చి చికిత్స చేయించుచుండెను. కాని కొలది దినములలోనే జ్వరము తీవ్రరూపముఁ దాల్పగా మరణించితిని. నేఁ జేసిన దుష్కార్యములనుబట్టియు, చండాలుని చేతఁ జంపఁబడుటఁబట్టియు బ్రహ్మరాక్షసుఁడనై జన్మించి యిట్టి క్రూరకార్యములను జేయుచు నీ మఱ్ఱిచెట్టుపైన నివసించుచు నీనాఁడు పుణ్యాత్ముఁడవైన నిన్ను దర్శించితిని. కనుక దయామయా! యీ దీనునియందు దయయుంచి చరమగీత ఫలము నొసంగి నా యీ భయంకరరూపమును బోఁగొట్టుము" అని ప్రార్థించెను. అపుడా దాసరి "అయ్యా

ఈ గీతముయొక్క ఫలమెంతటిదో నేనెఱుఁగను. అద్దాని వలన నీ కెంతవఱ కుపకృతి కలుగునో తెలియదు. నీమనస్సు పరివర్తనము నొందిన కారణమున నా పరాత్పరుని నీవును భజించితివేని యా కరుణానిధియే నిన్ను ను గాపాడఁగలఁడు." దాసరి యుపదేశానుసారముగ నా రక్కసియు భగవంతుని నుతింప వెంటనే రూపములో మార్పుజెంది వైష్ణవ రూపముతోఁ గన్పించెను. దాసరియు నాతనికి నమస్కరించి దేవదేవుని మహిమను గొనియాడుచు నటనుండి వెడలి పోయెను. ఆ రాకాసియు నారీతి వైష్ణవరూపమునొంది విష్ణు భజనముసేయుచుఁ గొలఁదికాలములోనే మోక్షమును బడసెను.

**ఈ విధ**ముగా మన్నారుస్వామి విష్ణుభక్తి మహిమను జెప్పి "విష్ణుచిత్తుఁడా! నీవు నీ బిడ్డను శ్రీరంగమునకుఁ గొంపోయితివేని ఆ దేవుఁడు తప్పక పరిణయమాడును. ఆమెయు నా దేవునితో సమస్తసుఖము లనుభవించి తుదకు శాశ్వతానందమును బొందును" అని చెప్పి యంతర్ధానము నొందెను.

విష్ణుచిత్తుఁ డపరిమితానందము నొంది వెంటనే గోదాదేవితో శ్రీరంగమునకు వెళ్ళి కావేరీనదిలో స్నాన సంధ్యాదులు నిర్వర్తించుకొని రంగని యాలయములోనికి వెడలి స్వామియెదుట నిలచి వాస్తవమును విన్నవించుకొని మనమున నా దేవునే ధ్యానించుచు నిలచియుండెను.

గోదాదేవియు నిశ్చలమనస్కయై తన కోర్కె యీడేర్ప రంగనాథు ననేకభంగుల బ్రస్తుతించుచుండెను.

రంగనాథుఁడా బాలికామణిని గాంచి యామె యందుఁ బ్రేమజనింప మనసు నిలుపఁజాలక రహస్యముగా గోదాదేవిని తన యంతఃపురములోఁ దాఁచి యొక కృత్రిమ గోదాదేవి నట నుంచెను. విష్ణుచిత్తుఁడు కొంత కాలము దేవుని స్తుతించి స్వామివారి తీర్థప్రసాదములను స్వీకరించి యా మాయబిడ్డను బల్లకి నెక్కించి విడిదికి వెడలి యా పల్లకిలోఁ జూచునప్పటికి బిడ్డ కన్పింపకపోయెను.

తనపుత్రిక కన్పడకుండుటకు విష్ణుచిత్తుఁ డడలి యిది యంతయు భగవంతుని మాయఁగాఁదలంచి "ఔరా! యీ రంగధాముఁడిట్లు చేయనేల? తానడిగిన నడుగుటయు తడవుగా నా పుత్రిక నీయ సిద్ధపడి యుంటినిగదా! ఈ విధముగా సప హరించి పదుగురిలో నన్ను వంచన చేయుట పాడియా? స్వయముగానే వెళ్ళి యడిగెదగాక" అనుచు వెంటనే రంగని కోవెలలోని కేగి రంగనాథుని కెదురుగా నిలచి "లోకరక్షకా! నీ దాసుఁడనైన నన్నీరీతి వంచింపనేల? నేను నీ యాజ్ఞ జవదాటువాఁడను కాదుకదా? ఈ మోసము చేయు గుణము తమ కెట్లబ్బినది? ఔనులే, చిన్ననాఁటి ప్రవర్తనలేల విడ నాడుదువు? బాల్యముగో గోపబాలురతోఁగూడి గోపికల యిండ్లలోదూఱి పాలు వెన్నల దొంగిలించి గొల్లపడుచులను వంచించినది నీవే కాదా? పెద్దవాఁడవైన పిదపఁగూడ జరా సంధుని జంపనెంచి గిరివ్రజములో దొంగదారిని బ్రవేశించి

యాతనిని మోసము చేయలేదా? ఉగ్రుపాలతో వచ్చిన విద్య యెట్లు పోఁగలదు? లోకనాథా! నా యీ యవమానమును దీర్పకున్న నీ యీ దొంగపనులను ముల్లోకములలోఁ జాటుదును సుమా! భక్తపరతంత్రుఁడవని నమ్మి నిన్ను బ్రార్థింపరాఁగా నా కిట్టి యవమానము కల్పించుటేల? దేవా! మాటలాడవేమి? నే నిట్లాడితినని కోపగించితివా? నీ భక్తునకుఁ గలిగిన యవమానము నీది కాదా?" అని సిష్ఠురము లాడుచు నిలచియుండ భగవంతుఁడు జాలిఁజెంది ప్రత్యక్షమై "ఓయీ! యింటిలోనే నీ పుత్రికను దించివచ్చి నన్ను నిందించిన లాభమేమి? నేనేమో మోసముఁ జేసితినని భ్రాంతిఁజెందక యింటికి వెళ్లి చూడుము" అని చెప్పి యంతర్ధానమయ్యెను. అపు డా విష్ణుచిత్తుఁడు భగవంతుని మాటల కబ్బురపడి యేమియు మాటలాడక వెంటనే తన విడిదికి వెళ్లుచుండెను. ఇల్లు సమీపించునప్పటికి గోదాదేవి యెదురుగావచ్చి "నాన్నా! నన్నొంటరిగావదలి యెచటికి వెళ్ళితివి?" అని యడిగెను. విష్ణుచిత్తుఁడు తన కొమరిత కన్పించుటకు సంతసించియు, నిష్కారణముగా భగవంతుని దూఱినందుల కెంతయు వగచుచు నింటిలోఁ బ్రవేశించెను.

అంత శ్రీరంగనాథునకు గోదాదేవియందుఁ బ్రేమ మిక్కుటముకాఁగా సామాన్యమానవునివలె సంతాపము నొందుచు భక్తులొసంగు నైవేద్యములనుగాని, బ్రహ్మాది దేవతలుచేయు నిత్యపూజలనుగాని కైకొనక ఖిన్నుఁడై యుండెను. అపుడు బ్రహ్మేంద్రాదులు భగవంతుఁ డట్లుం

డుటకు భయముచెంది "స్వామీ! మాపై నీ రీతిఁ గినుక వహింపనేల? మేమేమైనఁ దప్పులు చేసినయెడ మమ్ములను గనికరించి కాపాడవలదా? మీ రిట్లు మా పూజలను గైకొనక, నైవేద్యములను స్వీకరింపక, మాకుఁ బ్రసన్నులు కాకయుండుట చూడ నెంతయో భయమగుచున్నది. తల్లీ! తండ్రి విచారమునకుఁ గారణమేమియో నీవైనఁ జెప్పి మాకలఁతఁ దీర్పవా? లోకరక్షకా! ఈరీతి మీ రలుకఁ జెంది యున్న మేమేమి సేయఁగల్గుదుము? మాకు దిక్కెవరు? జాగుసేయక మాదోసమేమియో తెల్పుఁడు" అని యతి దీనముగా వేఁడుకొనిరి.

అపుడు రంగనాధుఁడు బ్రహ్మాదిదేవతలం గాంచి "దేవతలారా! మీరు చేసిన దోషములెవ్వియు లేవు. నా విచారకారణముం దెల్పెద నాలింపుఁడు. భాగవతోత్తముఁడైన విష్ణుచిత్తున కొక పుత్రిక గలదు. ఆమె బాల్యము నుండియు నా పాటలనే పాడుచుఁ బరమభక్తితోఁ గాలము పుచ్చుచుండెను. యౌవనముదయించిన దాది నాయందుఁ బతిభావముకలదియై నిద్రాహారములనుగూడ వదలి రాత్రింబవళ్లు నన్నే ధ్యానించుచున్నది. ఆమె భక్తికి వశ్యుఁడనై యేమిచేయుటకును దోపక యిట్లున్నాఁడను. భక్తుల కోర్కెలీడేర్చుట నావిధమై యున్నదికదా! నీ బిడ్డను నా కిచ్చి వివాహము చేయుమని విష్ణుచిత్తు నడుగుటయా, యది నావంటి వానికిఁ దగనిపని. ఆమె ప్రార్థనము నాలించి యంగీకరించుటయా, కాముకవృత్తియగును. మౌనము వహించి యూరకు

కొనుటయా భక్తురాలి ప్రేమను బ్రోసిపుచ్చుట యగును. ఇఁక నేమి చేయుటయో తోఁచక విచారించుచున్నాఁడ. మీరే యీ కార్యమును సాధింపనర్హులు. మీ రందఱును నీగ్రామముననే కాఁపురమున్న విష్ణుచిత్తుని గృహమునకు వెడలి యాతని పుత్రికను నాకిచ్చి వివాహముచేయ నర్థించి యీ కార్యమును జక్కఁబెట్టుకొని రావలసినది. ఆ కార్యమును మీరు నిర్వహించితిరేని నాకును, గోదాదేవికిని, లోకమునకును మేలుచేసినవా రయ్యెదరు.'' అని తన మనసులోని యుద్దేశమును వెల్లడించెను.

బ్రహ్మాది దేవత లట్టి యుత్తమకార్యమును నిర్వహింప నవకాశము లభించినందుల కెంతయు సంతసించి "లోకబాంధవా! యీ కార్యమును సాధించుటలోఁ గష్టమేమియుఁ గన్పట్టదు. అక్కన్నియకా, మీమీఁద గాఢమైన వలపు గలదు. కన్యతండ్రియగు విష్ణుచిత్తుఁడా, మీ యెడ భక్తిగలిగి మిమ్ములనే యెల్లపుడు ధ్యానించుచుండువాఁడు. రాయబారమునకు వెడలు మేమా, మీ యాదేశములను వెనువెంటనే సాధింప నుత్సాహము కలవారము. ఇఁక మీ సంగతి చెప్పనక్కఱలేదు. ఇట్లన్నియు సమకూడియుండ నీ కార్యము సాధించుట యెంతపని? ఇపుడే మేము వెడలి లోకానందకరమైన యీ పనిని జక్కఁబెట్టుకొని వత్తుము'' అని నుడివి స్వామికి నమస్కరించి బయల్వెడలిరి.

వారెల్లరు సంతోషమునఁ దేలియాడుచు విష్ణుచిత్తుని గృహమునకు వెడలిరి. విష్ణుచిత్తుఁడును బ్రహ్మేంద్రాదులు

తన యింటికి వచ్చినందులకు సంతసించి వారి కుచితరీతి మర్యాదలుసల్పి రత్నకంబళముపైఁ గూర్చుండఁజేసి "దేవర వారు విచ్చేయుటచే మా గృహము పవిత్రమైనది. తా మేతెంచిన కారణమెద్దియో తెల్పి నను ధన్యుంజేయుఁ"డని వేఁడుకొనెను. అపుడు వారు "విష్ణుచిత్తుఁడా! నీ పుత్రిక యగు గోదాదేవి శ్రీరంగనాథునియం దధికానురాగము కలదియైయున్న సంగతి నీ వెఱిఁగినదియే. రంగనాథుఁడును నామె భక్తికి లోనై యామెయందు గాఢానురాగము గలిగి యున్నాఁడను విషయము మా మాటలవలన నెఱుంగుము. మే మిపు డా లోకారాధ్యుఁడుపంపఁగా వచ్చియున్నారము. నీ పుత్రికయైన గోదాదేవిని శ్రీరంగనాథునికిచ్చి వివాహము చేసి లోకకల్యాణముఁ గావింప నిన్నర్థించుటకై వచ్చి యుంటిమి. ఇందు నీ యభిమతముం దెల్పి మాకు సంతసము చేకూర్చుము" అని సర్వము నెఱిఁగించిరి.

వారి సందేశము వినినంతనే విష్ణుచిత్తుని మన మమృతప్రవాహమున నోలలాడినట్లుండెను. ఆతఁడు పరమా నందముతో "మహానుభావులారా! సమస్తలోకాధీశుఁడగు రంగనాథుఁడు వరుఁడును, ఉత్తమలోకాధిపతులగు మీరు సంధానముచేయువారును, నా పుత్రిక రంగధామునిపై గాఢ భక్తిగలిగియున్నదియుఁ గాగా నేను కాదనుట కేవఁడను? స్వామివారి యభీష్టమును నెఱవేర్చుట నాకును సమ్మతమే. ఈ దాసుఁడు భగవంతుని యాజ్ఞకై యెదురు చూచు చున్నాఁడు. పెద్దలగు మీరే యీ సుముహూర్తమును

నిర్ణయించి, దాసుని యంగీకారమును స్వామికి విన్నవింపఁ వేఁడుచున్నాఁడ" అని నుడివి తాంబూలము లిచ్చెను.

వారా తాంబూలములను గ్రహించి విష్ణుచిత్తుని భక్తికి మెచ్చుకొనుచు సుముహూర్తమును నిర్ణయించి చెప్పి యటనుండి బయలుదేఱి రంగనాథుని సన్నిధికేగి యిచ్చట జరిగిన సంభాషణమును, విష్ణుచిత్తుని యంగీకారమును, సుముహూర్త నిర్ణయమును దెల్పిరి. అంతట విష్ణువు వివాహప్రయత్నములు చేయ వారికే యాజ్ఞాపించెను. వారు స్వామివారి యాజ్ఞను శిరసావహించి యనతికాలములోనే శ్రీరంగపట్టణమంతయు నలంకరింపఁజేసి సంభారముల నన్నిటిని సంపాదించి ప్రయాణమునకు సిద్ధమైయుండిరి.

విష్ణుచిత్తుఁడు రంగనాథునకుఁ దాను మామయగుటకు పొంగి వెంటనే పుత్రికతోఁ గూడ శ్రీవిల్లిపుత్తూరున కేగి భార్యకీ వృత్తాంతముం దెల్పి వివాహ ప్రయత్నములను జక్కపెట్టి, బంధుమిత్రాదుల కాహ్వానములంపి యా దినమున భగవంతుని రాకకై ఎదురుచూచుచుండెను.

శ్రీరంగధాముఁడు బ్రహ్మేంద్రాదులతోడను, సప్తమహర్షులతోడను, మునిపత్నులతోడను బయలుదేఱి శ్రీవిల్లిపుత్తూరునకు వచ్చెను. ఆ నగరము విష్ణుచిత్తునిబంధుమిత్రాదులతోడను, అనాహూతులయ్యు నీ లోకానందకరమైన వివాహమునుజూడ నేతెంచిన సమస్త దేశాధీశులతోడను, వరుని పక్షమున వచ్చిన దేవతాబృందముతోడను క్రిక్కిరిసి భూలోకస్వర్గమా యనునట్లుండెను. విష్ణుచిత్తుఁడును

బంధుమిత్రాదులతో వారి కెదురేగి మధుపర్కాదుల నొసంగి తీసుకొనివచ్చి విడిదిగృహమున దింపెను.

అంతట సుముహూర్తమున నాకసమునుండి పుష్ప వర్షము కురియుచుండఁగను, జయజయ నినాదములు మిన్ను ముట్టుచుండఁగను, దేవదుందుభులు మ్రోఁగుచుండఁగను శ్రీ మహావిష్ణువు విష్ణుచిత్తుని గృహమునకు వెడలి గోదాదేవి నగ్నిసాక్షికముగాఁ బరిణయమయ్యెను. అంత విష్ణుచిత్తుఁడు తన వైభవానుగుణముగ వరునకుఁ గట్నము లొసఁగి వధూవరులను శ్రీరంగమునకుఁ బంపెను. వారును బంధు వర్గములతోఁగూడ వెడలి యెల్లరను వీడ్కొల్పి శ్రీరంగ ధాముఁడు రంగమందిరమున గోదాదేవితోఁగూడి యిష్ట సుఖముల ననుభవించుచు భక్తుల కోర్కెలీడేర్చుచుండెను.

విష్ణుచిత్తుఁడును యథారీతి మన్నారుస్వామికి సేవా కైంకర్యములు చేయుచు భగవద్ధ్యానముననే నిమగ్నుఁడై తుదకు విష్ణుసాయుజ్యమును బొంది బ్రహ్మానందమున నోలలాడుచుండెను. విష్ణుచిత్తుని భక్తి ప్రవృత్తులు, భగ వంతుని భక్తపరాధీనత కొనియాడఁదగినవి కదా!

# 2. మణికంధరుఁడు

౧

మణికంధరుఁడుమహాప్రభావసంపన్నుఁడైన గంధర్వ కుమారుఁడు. ఈతఁడు తపశ్శక్తి సంపన్నుఁడు. సమస్త విద్యలయం దాఱితేరినవాఁడు. గాంధర్వ విద్యయం దసమాన ప్రజ్ఞావంతుఁడు. నారదునకుఁ బ్రియశిష్యుఁడు. ఎన్ని విద్యలు నేర్చినను నిగర్వశిరోమణి. ఎల్లపుడు పెద్దలకు శుశ్రూషచేసి ప్రజ్ఞా విశేషములను బడయఁగోరు నుత్తమ శీలుఁడు. ఎట్టి శ్రమలకైన నోర్చునట్టి ధీరుఁడు. ఈ మహానీయుని చరిత్ర మద్భుతముల కాలవాలమై వినువారి వీనులకు విందొనర్చుచుండును.

ఈ మహానీయుఁడు గంధర్వలోకమున జనించి సమస్త విద్యల నభ్యసించినపిదప సంగీత విద్యాభ్యాసమున మక్కువ కలవాఁడై దేవలోకమునకువచ్చి నారదమహర్షి నాశ్రయించి వానికి శుశ్రూషచేయుచు వానితోఁగూడ నెల్ల దేశములు తిరుగుచుండెను. నారదుఁడు దేవగానమున సమర్థుఁడయ్యు మానవగానమందలి విశేషములను సయితము తెలిసికొనఁగోరినవాఁడై శ్రీకృష్ణుని యనుగ్రహమునుసంపాదింపనెంచి మణికంధరునితోఁగూడ బయలుదేఱి తంబుర మీటుచు భగవన్నామ సంకీర్తనము చేయుచు నాకాశ మార్గమున దివ్యగమనముతో వచ్చుచు ద్వారకాపుర

మునకు సమీపమున నున్న ప్రమదోద్యానవనమును సమీపించెను.

ఆ సమయమున శ్రీకృష్ణుని సేవకురాలైన కలభాషిణి యను వేశ్యకాంత తన చెలికత్తియలతోఁగూడ నా యుద్యానవనమున విహరించుచుండెను. ఆమె సోయగ మచ్చర లేమలకైన నబ్బుటరుదు. ఆమె త్రిమూర్తుల పత్నులనుగూడ సౌందర్యమున నతిశయింపఁజాలిన బంగరు బొమ్మ. ఆమె చెలికత్తియలును నామెకు దీటువచ్చువారై యుండిరి. అట్టి యందముల రాణుల సంచారమువలన నా వనము నూతన కాంతులను వెదజిమ్ముచుండెను. వారు కొంతకాలము విహారములు సల్పి యుయ్యేలలూఁగ నారంభించిరి.

ఆ యుపవనమునకుఁ బైభాగమున వెడలుచున్న మణికంధరుఁడా కన్నియలంగాంచి వారి సౌందర్యమున కచ్చెరువొంది "గురువర్యా! చూచితిరిగదా! యీ యువతివల డోలావిహారనైపుణ్యము. వీరు నాగలోకమున నుండు సుందరాంగుల సౌందర్యమును గాలఁదన్నుచున్నారా యనునట్లు కాళ్లు పైఁబైజాచుచుఁ నెట్లుయ్యేల లూఁగుచున్నారో చూడుఁడు. ఆహా! ఏమి సౌందర్యము! ఇట్టి నిరుపమాన సౌందర్యవంతులు భూలోకమున జన్మించుట వింతగాదె!" అనుచు వచించెను. ఆతని వర్ణనాచమత్కారమును విన్న నారదుఁడు సంతసించి "మణికంధరా! నీవు సత్కవివౌదువుసుమా! నీ వర్ణనమెంతయు సముచితముగ

నున్నది.'' అనిపల్కి వారి సౌందర్యమునే మెచ్చుకొను చుండెను.

ఈ రీతి నారద మణికంధరులు ముచ్చటించు సమయముననే విమానారూఢులై పిల్లమబ్బులచాటున రంభానలకూబరులు ప్రయాణముచేయుచు వారి సంభాషణమును వినుచుండిరి. అపుడు రంభ నారద మణికంధరుల ప్రసంగమునకుఁ గోపము కలదియయ్యు నద్దానిని బయల్పడనీయక ''నాథా! యిపుడు మనము విన్న మాటలు నారదమహర్షివియే యై యుండనోపు. మన మా మహనీయుని దర్శించి వెడలుట యుచితముకదా!'' యని యడిగెను. నలకూబరుఁడును నందుల కంగీకరించి తన విమానమును నారదమునీంద్రుని పాదపద్మములకుఁ గ్రిందుగాఁ బోనిచ్చెను. నారదుఁడు వారిని గాంచి ''సుఖులా?'' యని యడుగ వారు వెంటనేయామహర్షి పాదములకు నమస్కరించిరి. నారదమహర్షియు ''మీపరస్పరానురాగము వర్ధిల్లుగాక'' అని యాశీర్వదించెను. రంభ నారదుని కపటపు దీవనలకుఁ గినుకఁ జెందియు నామెయుఁ గపటపువినయమునే యభినయించుచు నా దేవర్షితో నిట్లు ముచ్చటింప నారంభించెను.

రంభ:—మునిసత్తమా! మీయాశీర్వచనప్రభావము చేతనైన నలకూబరునకు నాపైఁ బ్రేమ యొకింత నిలచి యుండునేమో కాని మనుజకాంతల సౌందర్యమును జూచె నేని నా నాధునకు నాపైఁ బ్రేమ నిలచియుండుట యసంభవమేమో యని తోఁచుచున్నది.

నార:—రంభా! నీ మాటలలోని భావమేమియో నాకు స్పష్టముగ బోధపడకున్నది. ఒకింత వివరించి చెప్పుము.

రంభ:—స్వామీ! తమ రెద్దియో పనిమీఁద వెడలు చుండ నిట్టి మాటలతోఁ దమ ప్రయాణమునకు భంగము కల్గించుట యుచితము కాదేమోయని సందేహించుచున్న దాన.

నార:—నా ప్రయాణమున కెట్టి యాటంకము లేదు. కాని నీ మనస్సులోని మాటను నాకవగతమగునట్లు దెల్పుము.

రంభ:—దేవా! తమ రిట్లు నిలచియుండుటయు, మే మిట్లు కూర్చుండి మాటలాడుటయు నుచితము కాదు. దయ యుంచి తాము చు మా విమానముపై నెక్కి యుచితాసన మలంకరించిన సావధానముగ నంతయుఁ దమకు విన్న వింతును.

ఆమె మాటలను వినఁదలఁచిన నారదుఁడందుల కంగీ కరించి తన శిష్యుఁడగు మణికంధరునితోఁగూడ వారి విమాన మధిరోహించెను. అపుడు రంభా నలకూబరులు లేచి యా మునిస త్తము నుచితాసనముపైఁ గూర్చుండఁజేసి వా రిరువురును బ్రక్కలనిలచి వింజామరములతో వీవ నారం భించిరి. మణికంధరుఁడును గురువుగారి పాదముల చెంతఁ గూర్చుండియుండెను. అట్టి సమయమున రంభ సవినయముగ నిట్లు విన్నవింప నారంభించెను.

రంభ:—మహానుభావా! తా మింతకుముందు తమ శిష్యునితో ముచ్చటించిన విషయము రహస్యము కాదేని యద్దాని నానతీయ వేఁడుచున్నదాన.

నార:—(ముసిముసి నవ్వులు నవ్వుచు) రంభా! మఱేమియు లేదు. పూఁదోఁటలోఁ గలభాషిణి యుయ్యేల లూఁగుచు మీఁదిమీఁదికిఁ జాఁచుచున్న పాదము లచ్చెర మచ్చెకంటుల తలలందన్న నేగుచున్నవా యనునట్లు పై కెట్లు పోవుచున్నవో చూచితిరాయని మణికంధరుఁ డడుగ 'భళిరా! నీవు సత్కవివౌదువు సుమా!' అని యంటిని. ఇదియే మా ప్రసంగములోని సారాంశము. ఇందేమైన దోషముకలదా?

రంభ:—స్వామీ! యేదియో వర్ణనావిశేషమున నతిశయోక్తిగ నన్నమాటలలోఁ దప్పేమియుండును?

నార:—అందతిశయోక్తి యేమియు లేదు. యథార్థమే యనుకొంటిమి.

రంభ:—అతిశయోక్తి లేదంటిరి. ఇది యెట్లు నిజము కాఁగలదు? మానవయువతులు దేవకాంతలతో సాటిరా రనుట లోకసంచారులకుఁ దమకుఁ దెలియని విషయము కాదు. ఇందుకు సాక్ష్యము లోకమోహనమూర్తియగు నలకూబరుఁడు నాపై వలపువిలిపియుండుటయే కదా!

నార:—ఔనౌను. అతిసమన్ననలం బొందుచుండు వలన నట్టిదానవుగ నే భావించుచుందువు. అయిన నెల్లప్పుడు నిట్టిదినము లేయుండునని తలఁపకుము. క్రిందు మీఁదు, మీఁదు

క్రిందు నగుచుండుట లోకసహజ మనుమాట మఱువకుము. నినుబోలు యువతి నీకు సవతియైనపుడు నీవును, నలకూబరుని బోలువాఁడు సంభవించినపుడు నీనాథుఁడును నెట్లు పరితపింతురో గమనింపక గర్వోక్తులాడుట తగదు. రంభా! యిట్టి గర్వ ముచితము కాదు సుమా.

ఈ మాటలు వినునప్పటికి రంభ తత్తరపాటు చెంది "మునివరా! నేను నవ్వులాటకనినమాటలు నిజముగా దీసికొని మీ రిట్లు భయంకరముగఁ బల్కుట తగవగునా? అందును మీ వాక్యము లమోఘములుకదా! అయ్యో! నాకు సవతికలుగునని పల్కితిరే? సవతియే కల్గిన నేనెట్లు ప్రాణములతో నుండుదానను? అయ్యో! తమ రింతమాత్రమునకే యలుకఁజెంది యిట్టి భయంకరవాక్యములు పల్కిన నేనేమి చేయఁగలను! ఈ యబలయం దింతటి కినుకయా? ఔరా! యిఁక నేనేమి చేయుదును! ఎవరిని వేఁడుదును? కరుణామయా! యీ దీనురాలిపై దయయుంచి కాపాడుఁడు. నన్నట్టి యిక్కట్టులపాలు చేయకుఁడు" అని పాదములపైఁ బడి దీనముగా మొఱపెట్టుకొనెను.

నారదుఁడు రంభను లేవనెత్తి "సుదతీ! ఈ మాత్రమునకే యింత భయపడితివేల? నాయందమునకు నలకూబరుఁడే సాక్ష్యమని పల్కినపుడున్న నిబ్బర మిపుడేమైపోయినది? లోకములన్నిటిలో నేనేసౌందర్యవతినని విఱ్ఱవీగుట యొకరికిని దగదు. సౌందర్యమొకరి సొమ్మా? దేవకాంతలలోఁదప్ప సౌందర్యము మఱియొకరి కుండఁదగదా? ఈ

